శ్రీరస్తు.

# భక్తత్రాణపరాయణ

## శతకము

—:0:—

ఇయ్యది

ఆంధ్రగీర్వాణకవిత్వకావ్యనాటకాలంకారసాహిత్య పండితసార్వ
భౌములును, అద్వైతశాస్త్రసారవేదులును శ్రీ కోదండ
రామచరణారవిందధ్యానపరాయణులును

అగు

శ్రీ లింగం జగన్నాథరాయ కవివరునిచే రచింపఁబడి

యేతత్పౌత్రుఁడును, శ్రీ మాధవ లక్ష్మీనారాయణేత్యాది శతకనిర్మా
తయు, రిటైర్డు డిప్యూటి తహస్సీలుదారును, భక్తజన
చరణరేణువును, పీఠికాపురవాసియు

నగు

శ్రీ లింగం లక్ష్మీజగన్నాథరావుచే నాంధ్రీకరింపఁబడి

శ్రీ కింకపీంద్రఘటాపంచాననేత్యాది బిరుదాంకితులగు
శతావధాని చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిలవారిచే
సరిచూడఁబడి ప్రకటింపఁబడియె.

శ్రీమతేరామానుజాయ నమః.

# భక్తాణపరాయణ

## శతకము.



శ్లో. శ్రీకారుణ్యపయోనిధే రఘుపతే కోదండరామార్తిహన్
త్వత్పాదాబ్జనిషేవయాఽద్య కవితా గీర్వాణవాణ్యా శతమ్
శ్లోకానాం నిజభక్తిసూచనపరం శార్దూలనామాంకితం
దాస్యేఽహం విరచయ్య తుభ్యమమలం సంగృహ్యతాం మాధవాత్

॰. శ్రీకారుణ్యపయోనిధీ ! రఘుపతీ ! శ్రీరామచంద్రప్రభూ !
నీకారుణ్యమునం దెలంగుకవితన్ గీర్వాణభాషన్ మది
స్తోకంబై తగు భక్తి గన్పడెడు శార్దూలంబులౌ నూఱును
శ్లోకంబుల్ రచియించి యిచ్చితి దయన్ జూపించి గైకొంగదే.

శ్లో. అజ్ఞేనాఽపి తవైష పాదకమలధ్యానామృతాఽఽస్వాదినా
క్షిప్తం ప్రాజ్ఞసమీరితేన సదృశం స్వాదేన హృద్యంగమం తే
క్షుద్రేణాఽపి పరోపకారరతినా పానాఽర్హపాథోఽన్వితః
కూపో యద్యపి నిర్మితస్సతు జనాఽఽనందాయ కిం నో భవేత్ ॥

॰. నీచుండైనఁ బరోపకారపరతన్ దీయించు స్వాదూదకం
బై చెల్వొందఁడె కూప మెట్టులు జనాహ్లాదానుసంధాయి యౌ
నా చందంబున నజ్ఞుఁడైనను భవద్ధ్యానామృతాస్వాదినా
నాచేఁ గల్పితమైన దీన నగు నానందంబు నీ కెంతయున్.

శ్లో. శ్రీమద్రాజమహాధిరాజమకుటశ్రీరాజితాంఘ్రిద్వయం
శ్రీకుత్సాఖ్యపవిత్రగోత్రతిలకం శ్రీసూరిభిః పూజితమ్
శ్రీగోపాలపదాబ్జసక్తహృదయం శ్రీసోమనాథాఽభిధం
వందే కారణమాత్రలబ్ధజనుషం మద్దేశికం కోవిదమ్॥

శా. శ్రీమద్రాజమహాధిరాజమకుట శ్రీరాజితాంఘ్రిద్వయున్
శ్రీమత్కుత్సపవిత్రగోత్రతిలకున్ శ్రీసూరిసంపూజితున్
శ్రీమత్కృష్ణపదాబ్జసక్తహృదయున్ శ్రీసోమనాథాభిధున్
శ్రీమద్దేశికుఁ గారణప్రభవుఁ గూర్మిన్ మ్రొక్కి సేవించెదన్. 3

శ్లో. బాల్యే మాం గురుశబ్దవాచిన మిమం యోవా ఽకరో త్సార్థకం
యో భూమా నిజతత్త్వసంగ్రహపరో జాతో హరి ర్మానుషః
సోఽయం వేంకటకృష్ణభూపచరణో దేహస్య మే నాయకః
కిం కృత్వేహ భవామి నిష్కృతిపరో గాత్రార్పణా దన్యథా॥

మ. గురువం చేఁ బినవాఁడు పల్కు నుడికిన్ గొండొక్క సార్థక్యమున్
గరుణన్ గొల్పిన తత్త్వమూర్తికి నరాకారమ్మునం దున్న శ్రీ
హరికిన్ వేంకటకృష్ణభూపతికి నే నాత్మ న్విినా యేమొసం
గి ఋణం బీఁగినవాఁడ నాదు ననఘున్ గీర్తింతు నత్యంతమున్. 4

శ్లో. భక్తానుగ్రహదీక్షయా కలియుగే కృత్వా ఽభయం హస్తగం
వైకుంఠా దవతీర్య శ్రీలకవరే పుష్పాఖ్యశైలే వసన్
శ్రీకోదండశరాన్వితో రఘుపతే తూష్ణీం విలంబః కుతో
భక్తార్తిపరాయణత్వ మధునా మయ్యాశు సత్యం కురు॥

మ. శరకోదండము లూని భక్తజనరక్షాదీక్షఁ గైకొంచు భా
స్వర వైకుంఠము వీడి లక్కవర మన్పల్లె న్విరాజిల్లు సుం
దరమౌ పుష్పగిరి న్వసించు రఘునాథా! జాలమేలింక న
త్వరతన్ నాపయ్ని భక్తరక్షణపరత్వంబున్ బ్రదర్శింపుమా. 5

శ్లో. లోకే ఽస్మి న్నహి దృశ్యతే మదపరః పాపీ విమూఢాఽఽత్మక
స్త్వత్తో ఽన్యశ్చ కృపాపరో రఘుపతే దేవేషు నో దృశ్యతే
త త్తే ఽహం శరణం వ్రజామి సతతం పాదాఽమ్బుజం ముక్తిదం
భక్తత్రాణపరాయణత్వ మధునా మయ్యాశు సత్యం కురు॥

శా. నాకంటెన్ గడుఁ బాపి మత్తుఁడు ధర న్గానంబడం డొక్కఁడున్
నీకంటెన్ గరుణాసముద్రుఁ డొకఁడున్ లేఁ డెందు దేవాళిలో
జోకన్ ద్వచ్చరణాబ్జముల్ శరణ మంచున్ గూర్మి సేవింతు దే
వా! కంజేక్షణ! భక్తరక్షణపరత్వంబున్ బ్రదర్శింపుమా. 6

శ్లో. శిష్టా ఽనుగ్రహ దుష్టనిగ్రహకృతే స్వస్యా ఽవతారో హరే
నిత్యం త్వచ్చరణారవిందయుగళీ సేవారతం దుర్విధమ్
భక్తం మాం కి ముపేక్షసే రఘుపతే క్రూరాత్మభి ర్వంచితం
భక్తత్రాణపరాయణత్వ మధునా మయ్యాశు సత్యం కురు॥

మ. వరదా! దుర్జనశిక్షణంబు సుజనవ్రాతావనంబున్ గదా
ధరణి న్నీయవతారకార్యములు? త్వత్పాదాంబుజద్వంద్వదా
స్యరతున్ దుర్విధు న న్నుపేక్ష సలుప న్న్యాయంబె? రమ్మింక స
త్వరతన్ నాయెడ భక్తరక్షణపరత్వంబున్ బ్రదర్శింపుమా. 7

శ్లో. త్వత్పాదాబ్జరజోఽపి పాతకిజనం సద్యః పునా త్యద్భుతం
త్వద్భక్తాస్తు సముద్ధరంతి నిరయం గచ్ఛంతమ ప్యాశ్రితమ్
త్వన్నామా ఽఽశ్రితకల్పభూరు డధునా కిం త త్పున ర్వర్ణ్యతే
భక్తత్రాణపరాయణత్వ మధునా మయ్యాశు సత్యం కురు॥

మ. ఖలులన్ బుణ్యులఁ జేయు నీపదపరాగం బద్భుతం బాశ్రితా
వలికిం గల్పమహీరుహం బగుఁ దలంప న్నీదునామంబు త
న్నలయున్ దుర్గతిఁ బాయఁ జేయు భవదీయైకాంతభక్తుండు నిన్
దలఁప న్వేరొక్కఁ? భక్తరక్షణపరత్వంబున్ బ్రదర్శింపుమా. 8

శ్లో. జ్ఞానే నో పరిపక్వతా న హృదయే నైశ్చల్యభావోదయ
స్సత్సంగశ్చ నవిద్యతే పునరహో మోక్షేతు తృష్ణాఽధికా
సంవేశేపిచ నస్మరామి తవ శ్రీనామావళిం శ్రీపతే
భక్తత్రాణపరాయణత్వ మధునా మయ్యాశు సత్యం కురు॥

శా. జ్ఞానం బేమియు లేదు, చిత్తమునకున్ జాంచల్యముల్ వోదు, సం
తైవల్ సజ్జనసంగ మబ్బ దపు, డట్లయ్యున్ ఘనం బాశ డెం
దానన్ మోక్షమునందు నేఁ దలఁప నిద్రన్ గూడ నీనామ మ
ప్పా! నాయందున భక్తరక్షణపరత్వంబున్ బ్రదర్శింపుమా.

శ్లో. గ్రాహాగ్రస్తగజేంద్రదుఃఖదమనే యా వ్యగ్రతా స్వీకృతా
ద్రౌపద్యాఅపి మానరక్షణవిధౌ యావా దయా దర్శితా
సా తే కిం కరుణా ఽద్య కుత్రను గతా సీతాపతే బ్రూహిభో
భక్తత్రాణపరాయణత్వ మధునా మయ్యాశు సత్యం కురు॥

మ. కరినాథున్ గృప నీవు ప్రోవఁ జనుచోఁ గైకొన్న సంరంభముల్
బరమాశ్చర్యము గాఁగ ద్రౌపదిని బ్రోవం జూచున ప్డావ్వ నీ
కరుణావేశ మ దెందుఁ బోయె నిపు డో కంజాక్ష? నాయందు స
త్వరతన్ దావకభక్తరక్షణపరత్వంబున్ బ్రదర్శింపుమా. 10

శ్లో. యే కారుణ్య మవాపు రూర్జితతమం తే యాదవా ఽఽద్యాః పురా
కిం వోపాయన మర్పయేయురపి తే కిం వా న దద్యా మహమ్
ద్వే ముష్టీ పృథుకా నహో రఘుపతే ఽదా ద్వై కుచేలః పరం
భక్తత్రాణపరాయణత్వ మధునా మయ్యాశు సత్యం కురు॥

మ. ఘనమౌ నీకృపకై యదూద్వహులు కావన్ పూర్వ మే మిచ్చి రే
మును నేఁ డీయని దద్ది? సత్త్వగుణమాన్యుం డా కుచేలుం డిడన్
గొనలేదే ముదమార రెండుపిడు లడ్కుల్? నాయెడన్ వేగ నా
వనజా తేక్షణ? భక్తరక్షణపరత్వంబున్ బ్రదర్శింపుమా. 11

శ్లో. దీనా దానవదాశకీశశబరీ రుద్ధర్తుకామ స్స్వయం
మానాऽతీతకృపాన్విత శ్శ్రుతిశతై ర్గానార్హతాం నీతవాన్
జానా మ్యేత దహం క్వచి న్మదవనే కానామ తే న్యూనతా
భక్తత్రాణపరాయణత్వ మధునా మయ్యాశు సత్యం కురు॥

మ. మును పాదానవదాశకీశశబరీముఖ్యార్థులన్ బ్రోవఁగా
ఘనకారుణ్యముఁ బూని యామ్నితతులన్ గానార్హతన్ గాంచితి
వనఘా! కల్గునె నీకు నింద యొకమా అల్పాత్ము నన్ బ్రోవ? నో
వనజాతంబక! భక్తరక్షణపరత్వంబున్ బ్రదర్శింపుమా. 12

శ్లో. నిత్యం త్వత్పదపద్మసక్తహృదయా యే సర్వత స్సాహృదా
ముక్తిం దాయమి వాऽऽహరంతి నతు తచ్చిత్రం క్వచిత్తే స్వయమ్
కైవల్యం త్విహ దాస్యసీశ! యదిమేమూఢస్యచిత్రంపరం
భక్తత్రాణపరాయణత్వ మధునా మయ్యాశు సత్యం కురు॥

మ. సతమున్ దావకపాదపద్మభజనాసక్తుల్ సదా సౌహృగుల్
ప్రతివన్ దాయమువోలె మోక్షమును సంపాదింతు రిందె? నన్
మతిహీనున్ గాని మోక్ష మిచ్చుటయె సుమ్మా! చేటిచిత్రం బగుఁ
బతితోద్ధారక! భక్తరక్షణపరత్వంబుఁ బ్రదర్శింపుమా. 13

శ్లో. విత్తాపత్యకళత్ర మిత్రసదనే ష్వత్యంతసక్తం పునః
కృత్వా దుస్సహతాపతప్త మిహ మాం నిత్యానపాయా స్థితా
మాయా తే; శరణం గతోऽస్మి భగవం స్త్వాం శాధి సీతాపతే;
భక్తత్రాణపరాయణత్వ మధునా మయ్యాశు సత్యం కురు.

మ. సదనాపత్యకళత్ర మిత్రధనసంసక్తుఁ నను ఘోరసం
పదవాగ్నిన్ దహియింపఁ జేయుచుఁ గడుఁ బాధించు నీమాయ, దయా
సదయా! నిన్ శరణంబు వేఁడెదఁ ద్వరన్ శాసించి యద్దాని నా
పదఁ బోఁద్రోయుచు భక్తరక్షణపరత్వంబుఁ బ్రదర్శింపుమా. 14

శ్లో. ఆప్రాణీశ పిపీలికాదితనుషు వ్యోమేవ సంతం దృఢం
త్వా మావిద్య చరంతి సంసృతి పరా స్సంతోఽపి కిం మాదృశాః
త న్నిర్వ్యాజకృపాన్విత స్త్వమధునా మాం తారయ శ్రీపతే
భక్తత్రాణపరాయణత్వ మధునా మయ్యాశు సత్యం కురు॥

శా. ఆనీరేజభవాల్ప కీటముఖదేహాళిన్ సదా యొప్పుచుం
గానన్ రాకయె వ్యోమము ట్లెసఁగు నిన్ భావించు ధీశాలులున్
మానంజాలరు సంసృతిన్. దలఁప నామాటేల ? ప్రేమంబు డెం
దానం దాలిచి భక్తరక్షణప-త్వంబున్ బ్రదర్శింపుమా. 15

శ్లో. రత్నభ్రాజిత నూపురాంచిత మృదుశ్రీపాదపద్మద్వయం
కేయూరస్ఫుర దంగుళీయకయుతాన్ బాహూం శ్చపంచాయుధాన్
దీవ్యత్కుండలగండమండితముఖం భావత్క మారాధయే
భక్తత్రాణపరాయణత్వ మధునా మయ్యాశు సత్యం కురు॥

మ. వరరత్నోజ్జ్వలనూపురాంచితపదాబ్జద్వంద్వమున్ నీమనో
హరకేయూరశుభోర్మికా లలితహస్తాంభోజదివ్యాయుధో
త్కరమున్ గుండలగండమండితలసద్వక్త్రంబు వర్ణించెదన్
వరదా ! వైళమ భక్తరక్షణపరత్వంబున్ ప్రదర్శింపుమా. 16

శ్లో. వాణీం మే తవ దివ్యనామకథనే శ్రోత్రే కథాఽఽకర్ణనే
పాణీ పాదసమర్చనే నిజదృశౌ త్వన్మూర్తిసందర్శనే
చిత్తంచ త్వయి సంతతం దృఢతరం సంస్థాప్య లక్ష్మీపతే
భక్తత్రాణపరాయణత్వ మధునా మయ్యాశు సత్యం కురు॥

శా. నీనామావళి జిహ్వయందుఁ, జెవుల న్నీసత్కథల్, చేతులం
దానందం బిడు నీపదాబ్జభజనం, బక్షిద్వయి న్మూర్తి, డెం
దానన్ నీదగుధ్యానమున్ స్థిరముగా నాకున్ ప్రసాదించి నీ
వానిన్ నన్ గాని భక్తరక్షణపరత్వంబున్ బ్రదర్శింపుమా. 17

శ్లో. త్వత్పాదాంబుజశౌచవారి నిఖిలం పాపం దహే త్సేవినాం
త్వన్నిర్మాల్యధరో ఽధిగచ్ఛతి పదం బ్రహ్మాదిభి ర్దుర్లభమ్
తే ఽనుగ్రహమంతరేణ భగవ న్నోఽవా క్షమో ఽధ్యాసితుం
భక్తత్రాణపరాయణత్వ మధునా మయ్యాశు సత్యం కురు॥

శా. పాపౌఘంబుల నిర్దహించెడు భవత్పాదాబ్జశౌచాంబువుల్
ప్రాపించుఁ విధి యందలేనిగతి నిర్మాల్యంబు పైఁ దాల్చినన్.
లోపించుంగద ? యివ్వి నీకృపకుఁ బాత్రుల్ గాని యెవ్వారికిన్
పాపధ్వంసక ! భక్తరక్షణపరత్వంబుఁ ప్రదర్శింపుమా. 18

శ్లో. కామాఽఽతంకకళంకితేన మనసా నీతస్తు కాలో మయా
క్షేమోపాయవిహీన ఏష కిమహో మోహాతిరేకః ప్రభో
భూమా వాత్మసమో నచాఽస్తి కుమతి స్త్రాయస్వ సీతాపతే
భక్తత్రాణపరాయణత్వ మధునా మయ్యాశు సత్యం కురు॥

మ. కడచెఁ గాలము దర్పకాతంకకళంకంబైన చిత్తంబుతోఁ
గడు మోహంబది క్షేమశూన్యమగు మార్గంబౌట తెల్లంబ యీ
పుడమిన్ గన్పడ రెందు నేనిఁ గుమతుల్ పోల్పంగ నాతోడ నన్
వడి రక్షింపుము భక్తరక్షణపరత్వంబున్ ప్రదర్శింపుమా. 19

శ్లో. త్వన్మాయాపరిమోహితా శ్శివవిరించాఽఽద్యామరాః కిం పున
ర్మర్త్యోఽహం జడధీ రతీవ కృపణ శ్చాపల్యకాపాయవాన్
త్రాయస్వ ప్రణతోఽస్మి తే రఘుపతే జానామి న త్వాం వినా
భక్తత్రాణపరాయణత్వ మధునా మయ్యాశు సత్యం కురు॥

మ. జలజాతాసనశంకరాదులును యుష్మన్మాయచే మోహితుల్
తలఁప న్నే నొకమర్త్యుఁడఁ జడుఁడ నత్యంతంబు లోభిన్ గడున్
చలచిత్తుండను మ్రొక్కెదఁ బరు సెదన్ సంధింప నన్ వేగ నీ
వలనుం జేరిచి భక్తరక్షణపరత్వంబున్ బ్రదర్శింపుమా. 20

శ్లో. లోకాఽతీతగుణాశ్రయ శ్రితజనానందానుసంధాయక
స్త్వత్తోఽన్యస్తు నవిద్యతే తదధునా త్వామేవ సేవే పరమ్
క్షీరే మజ్జయ వోత వారిణి హరే ! భార స్త్వదీయోహి మే
భక్తత్రాణపరాయణత్వ మధునా మయ్యాశు సత్యం కురు॥

శా. లోకాతీతగుణుం డనుత్తముఁడు సుశ్లోకుండు సంసేవకా
నీకానందకరుండు నీవ యనుచున్ నిన్ గొల్తు నీవాఁడ నన్
నీఁకన్ క్షీరములందు ముంచెదవొ ? యానీరంబులన్ ముంచెదో ?
వైకుంఠాధిప ! భక్తరక్షణపరత్వంబున్ బ్రదర్శింపుమా. 21

శ్లో. దైత్యేంద్రార్తికరౌషధం దివిషదాం సంజీవనైకౌషధం
సంసారామయమూలఘాతచతురం దివ్యౌషధం సేవినామ్
దత్వా దుర్లభ మద్య మే రఘుపతే త్వన్నామమంత్రౌషధం
భక్తత్రాణపరాయణత్వ మధునా మయ్యాశు సత్యం కురు॥

మ. దనుజాతార్తికరౌషధంబు దివిషత్సంజీవనైకౌషధం
బనఘా ! సంసృతికర్తనౌషధము దివ్యంబౌ భవన్నామమన్
ఘనమంత్రౌషధమున్ గృపాపరుఁడవై నా కిచ్చి రక్షించి నీ
తనయున్ నన్ గొని భక్తరక్షణపరత్వంబున్ బ్రదర్శింపుమా. 22

శ్లో. 'రా' శబ్దగ్రహణేన గచ్ఛతి బహి స్సర్వం ముఖా ద్దుష్కృతం
భూయోఽప్యాగతిశంకయాఽర్గళధురం త 'న్మే'తి వర్ణోఽన్వగాత్
పుంసా మర్థచతుష్కదాననిపుణం రామేతి వర్ణద్వయం
భక్తత్రాణపరాయణత్వ మధునా మయ్యాశు సత్యం కురు॥

మ. వెడలున్ వక్త్రమువెంట నెల్లయఘముల్ భీతిల్లి "రా" యన్నచో
గడెకట్టన్ బలె "మ" యటన్న నది యాకట్టున్ బ్రవేశంబు, దాఁ
బడయున్ "రామ" యటంచుఁ బల్కినఁ జతుర్వర్గంబు తథ్యంబు నన్
బడిగాఁ జేకొని భక్తరక్షణపరత్వంబున్ బ్రదర్శింపుమా. 23

శ్లో. గోవిందేతి జనార్దనేతి నృహరే వైకుంఠ భక్తార్తిహన్
శ్రీరామా ఽచ్యుత కైటభాంతక విభో ! శ్రీపుండరీకాక్ష మామ్
త్రాయస్వేతి దిశ స్మృతిం రఘుపతే మే త్వేత దేవాఽఖిలం
భక్తత్రాణపరాయణత్వ మధునా మయ్యాశు సత్యం కురు॥

మ. సరసీజాక్షా ! జనార్దనా ! మురహారీ ! సర్వేశ ! గోవింద ! యో
పరమాత్మా ! రఘురామ ! కైటభహరా ! భక్తార్తినిర్వాపకా !
వరదా ! పాహి మ్మటన్న సత్స్మృతియె సర్వంబంచు వాంఛింతు స
త్వరతన్ గూరిచి భక్తరక్షణపరత్వంబున్ బ్రదర్శింపుమా. 24

శ్లో. సంసారార్ణవతారకం మునిజనానందైకసంధారకం
భక్తాకాంక్షితపూరకం శ్రితజనాఽఘౌఘాఽద్రిసందారకమ్
సంపత్కారక మర్థదం రఘుపతే త్వత్తారకం దేహి మే
భక్తత్రాణపరాయణత్వ మధునా మయ్యాశు సత్యం కురు॥

మ భవనీరాకరతారకంబు శ్రితపాపగ్రావసందారకం
బవనిన్ సేవకకామపూరకము జ్ఞానానందసంధారకం
బవునా వైభవకారకంబు సుకరంబౌ తారకం బిచ్చి దు
ర్భవమున్ బాపుచు భక్తరక్షణపరత్వంబున్ బ్రదర్శింపుమా. 25

శ్లో. మాతా త్వం భగవన్ పితా చ నృహరే భ్రాతా త్వమేవేహ మే
దాతా చాఽఖిలసంపదా మనుకలం త్రాతా భయేభ్యో ద్విషామ్
నేతా చేంద్రియకప్రవర్తనవిధౌ నాఽన్యోఽస్తి హి త్వాం వినా
భక్తత్రాణపరాయణత్వ మధునా మయ్యాశు సత్యం కురు॥

మ. పితయున్ మాతయు భ్రాత యింద్రియములన్ బ్రేరేచు నిర్ణేత వి
స్తృతసంపద్వరదాత శాత్రవభయావ్యగ్రాత్మసంత్రాతయున్
మతి నూహింపగ లేడు వేఱొకండు నిన్ బ్రార్థింతు సక్రాంతమున్
ఖగరాడ్వాహ ! భక్తరక్షణపరత్వంబున్ బ్రదర్శింపుమా. 26

శ్లో. ఆలీఢాఽఽఖ్యపదే స్థిత శ్శితశరం శార్ఙ్గాఖ్యచాపే దృఢం
సంయోజ్యాఽఽశు వికృష్య మద్రిపుజనే ముక్త్వాఽప్రమాదం హరే
భస్మీకృత్య ఖలా న్విధేహి చ ముదం స్వేషాం పరం శ్రీపతే
భక్తత్రాణపరాయణత్వ మధునా మయ్యాశు సత్యం కురు॥

శా. ఆలీఢంబుగ నిల్చి శార్ఙ్గమున తీక్ష్ణాస్త్రంబు సంధించి నీ
వాలస్యం బొనరింప కక్కడి, మదీయారాతులౌ దుర్జనుల్
కాలుం జేగఁగఁగొట్టి యాశ్రితుల కాహ్లాదంబు చేకూర్చుమా
వాలాయంబుగ భక్తరక్షణపరత్వంబున్ బ్రదర్శింపుమా. 27

శ్లో. వైదేహీసహిత స్సదా మమ హృది స్థిత్వా స్ఫుర న్నన్వహం
ధ్యానానుస్మరణం ప్రపత్తిమపి మే దత్వాఘ మున్మూలయన్
అజ్ఞానంచ హర న్నఖండవిభవం సంప్రాపయన్ శ్రీపతే
భక్తత్రాణపరాయణత్వ మధునా మయ్యాశు సత్యం కురు॥

మ. నిరతంబున్ హృది సీతతోఁ గనఁగనై నీధ్యానమున్ భక్తియున్
స్మరణంబున్ గలిగించి నాయఘములన్ మాయించి యజ్ఞానమున్
దొలఁగంజేసి యఖండవైభవమునన్ దూఁగాడఁగాఁ జేయుమున్
బరమాత్మా ! వడి భక్తరక్షణపరత్వంబున్ బ్రదర్శింపుమా. 28

శ్లో. సుందస్త్రీహననే సుబాహుహరణే కాకాక్షినిర్మూలనే
మారీచస్య వధే దశాస్యనిధనే ముక్తాశ్చ యే మార్గణాః
తేషా మన్యతమేన మే ఽఖిలరిపూ నంతర్గతాం స్సంహరన్
భక్తత్రాణపరాయణత్వ మధునా మయ్యాశు సత్యం కురు॥

మ. ఖలుమారీచు సుబాహు బట్టివదనున్ గాకాక్షి నత్తాటకన్
బలిఁ గూల్చన్ విడినట్టి బాణములలోనం దేని చేనైన నన్
గలఁగంజేసెడి యంతరంగరిపులన్ ఖండించి నీపాదముల్
దలఁపన్ జేయుము భక్తరక్షణపరత్వంబున్ బ్రదర్శింపుమా 29

శ్లో. త్వత్పాదాంబుజసేవినాం పరిభవం దుష్టాఽతికష్టాఽఽత్మనా
మౌన్నత్యంచ కథం సహిష్యతి భవాన్ దృష్ట్వైవ సంతుష్టో విభో
వ్యత్యస్తం త్వపనోదయాఽఽశు భగవ న్మాఽభూ దకీర్తిస్తు తే
భక్తత్రాణపరాయణత్వ మధునా మయ్యాశు సత్యం కురు॥

మ. పుడమిన్ ద్వత్పదసేవకావళిపరాభూతిన్ మహౌన్నత్యమున్
గడు దుష్టాత్ములు నొందఁ గాంచు టెటులన్ సైరింతువో దేవ ! యీ
తడఁబాటున్ సవరించి లోకమున సిద్ధంబౌ నపఖ్యాతినిన్
పడఁ బోఁ డట్టుము భక్తరక్షణపరత్వంబున్ బ్రదర్శింపుమా. 30

శ్లో. ఆక్రోశం మమ నోశృణోషి భగవ న్కిం యోగనిద్రాం భజ
స్యంకస్థాఽపి ధరాసుతా మమ దశాం నోవక్తి వా తే స్వయమ
నోచే న్మత్కృతకర్మభుక్తి రధునా నాంతం జగామ ప్రభో !
భక్తత్రాణపరాయణత్వ మధునా మయ్యాశు సత్యం కురు॥

మ. వరదా ! నా మొఱ నీ చెవిన్ బడదొ ? త్వద్వామాంకమం దున్న యీ
ధరణీజాతయుఁ జెప్పదో ? అకట ! నిద్రం జెందెదో ? యోగమం
దరయన్ మత్కృతకర్మభుక్తి యిపుడున్ సాంతంబు గాకుండెనో ?
త్వర నన్ జేకొని భక్తరక్షణపరత్వంబున్ బ్రదర్శింపుమా. 31

శ్లో. కీనాశో భృశకోపన స్త్వనుచరాః క్రూరా స్త్వదీయాః పరం
పాపోఽహం నన హేత దంతకకృతాం నానావిధాం యాతనామ్
త్రాయస్వ ప్రణమామి తే రఘుపతే జానామి తే పౌరుషం
భక్తత్రాణపరాయణత్వ మధునా మయ్యాశు సత్యం కురు॥

మ. యముఁడా ? కోపి; తదీయకింకరులు క్రూరాత్ముల్ గడున్; నేను జా
[illegible]డ మహాపాపిని; వారు యాతనలు పెట్టన్ సైఁచఁ గాఁ జాల; నే
మమునన్ బ్రొక్కెద; నే నెఱుంగుదును రామా ! నీదువంతంబు; పా
పములన్ దూలిచి భక్తరక్షణపరత్వంబున్ బ్రదర్శింపుమా. 32

శ్లో. సేవేఽహం శ్రుతిమౌళిభాగవిలసత్త్వత్పాదపంకేరుహం
మాయేయం తవ మోహపాశజననీ సమ్మోదితాచే ద్భృశమ్
పూత స్స్యాం శ్రితపాపభంజన హరే! గామి త్వదీయం యశో
భక్తత్రాణపరాయణత్వ మధునా మయ్యాశు సత్యం కురు॥

శా. సేవింతున్ శ్రుతిసూక్తిమౌళివిలసచ్ఛ్రీత్వత్పదాబ్జద్వయిన్
దేవా! మోహలతాభివృద్ధకరమౌ నీమాయ మాయించి నన్
వేవేగన్ బరిపూతుఁ జేయవె? కడున్ గీర్తింతు నీకీర్తి స
ద్భావా! మాధవ! భక్తరక్షణపరత్వంబున్ బ్రదర్శింపుమా 33

శ్లో. కాలేఽస్మిన్ భవదీయభూరికరుణాం స్తోతుం ప్రభుః కో భవే
త్కృత్వా పాపసహస్రమ ప్యవశత స్త్వన్నామచే త్స్మర్యతే
దగ్ధ్వా తస్య దురంతఘోరకలుషం దాస్య త్యహో త్వత్పదం
భక్తత్రాణపరాయణత్వ మధునా మయ్యాశు సత్యం కురు॥

మ. వనజాతేక్షణ! నీయపారకరుణన్ వర్ణింపఁగాఁ జాలునా
ఘనుఁ డేఁడీ? యొకసారి మాటవరుసంగా నేని నీనామ మెం
దనినన్ ఘోరసహస్రపాపములఁ బాయం జేసి నీస్థానమున్
దనుకం జేయును. భక్తరక్షణపరత్వంబున్ బ్రదర్శింపుమా. 34

శ్లో. నిత్యం స్వోదరపూరణార్థ మసత స్సంసేవ్య కాలో మయా
నీత స్స్వాశ్రితరక్షణైకనియమం త్వా మద్య విజ్ఞాపయే
ఆగో భూరి కృతం క్షమస్వ నృహరే! సూనోః పితే వాజ్ఞతాం
భక్తత్రాణపరాయణత్వ మధునా మయ్యాశు సత్యం కురు॥

మ. చనియెన్ గాలము స్వోదరార్థముగ దుష్టస్వాములన్ గొల్చుటన్
మనవిం జేతుఁ గృతాపరాధుఁడను నన్ మన్నించి పుత్రున్ బలెన్
మనుప న్వేఁడెద నాశ్రితావనుఁడ వన్నామంబు నీకుంట. నా
వనట న్మానిపి భక్తరక్షణపరత్వంబున్ బ్రదర్శింపుమా. 35

శ్లో. హే వైకుంఠ రమాధినాథ భగవ న్నిత్యానుకంపానిధే
హే దైత్యాంతక దీనరక్షక నమ స్తే పాహి మాం సంసృతేః
హే ముక్తిప్రద హే జగత్త్రయగురో హే నాథ లక్ష్మీపతే
భక్తత్రాణపరాయణత్వ మధునా మయ్యాశు సత్యం కురు॥

శా. ఓ వైకుంఠ! రమాధినాథ! నృహరీ! హో దైత్యనిర్మూలకా!
హో విశ్వేశ్వర! దీనరక్షక! హరీ! హో ముక్తిసంధాయకా!
హో విశ్వాత్మ! కృపాసముద్ర! భవరోగోద్విగ్ను రక్షించినన్
భావాంతర్గత! భక్తరక్షణపరత్వంబున్ బ్రదర్శింపుమా 36

శ్లో. దైత్యేంద్రప్రతిమాన దుర్జనసమాక్రాంతా స్సమస్తా దిశ
స్సాధూనాం సకలాపద స్సముభవ న్నర్థాతురా భూమిపాః
త్వంచే న్మధ్యపదస్థిత స్త్వదపరః కోవాఽస్తి నేతా హరే
భక్తత్రాణపరాయణత్వ మధునా మయ్యాశు సత్యం కురు॥

శా. రక్షోనాథసమాన దుర్జనసమాక్రాంతంబు లీదిక్కుల్
సత్సాధుల్ సుజనుల్ విపత్తులను; రాజన్యుల్ ధనాశాపరుల్
దక్షుం డేడిక నీ వుపేక్ష సలుపన్ ధర్మంబు గాపాడఁగాఁ
శ్రీశధ్వ! భక్తరక్షణపరత్వంబున్ బ్రదర్శింపుమా. 37

శ్లో. సాత స్సంతత మామనంతి భగవం స్త్వామేవ సేవ్యోత్తమం
భక్తానా మిహ భుక్తిదం కలిహరం దేహాత్యయే ముక్తిదమ్
త త్సేవే తవ పాదపద్మయుగళం త్రాయస్వ సీతాపతే
భక్తత్రాణపరాయణత్వ మధునా మయ్యాశు సత్యం కురు॥

మ. అనఘా! సేవ్యుల నుత్తముం డనుచు భక్తాఘౌఘనిర్మూలనున్
బొనరిం తందురు భూమిపై సుఖములున్ మోక్షంబు దేహాంతమం
దునఁ జేతు వటంచు నాడెదరు సాధుల్ ప్రోత్తు నీపాదసే
వనమున్ జేసెద. భక్తరక్షణపరత్వంబున్ బ్రదర్శింపుమా. 38

శ్లో. ఆదేహాంత మహర్నిశం మమ మన స్త్వత్పాదలగ్నం భవే
ద్గాత్రం చాఽస్తు నిరామయం దృఢతరం త్వత్పాదపూజాక్షమమ్
మాభూ త్త్వాంతు విహాయ దేవ సుతరా మన్యాశ్రయం జీవితం
భక్తత్రాణపరాయణత్వ మధునా మయ్యాశు సత్యం కురు॥

శా. ఆదేహాంత మహర్నిశంబు హృదయం బౌఁగాక లగ్నంబు నీ
పాదాబ్జంబులఁ గాయమూర్జ యుజలకుఁ బాల్గాక నీసేవ సం
పాదింపం దగుగాక. ఆశ్రయము సర్వం బీవె యౌఁగావుతన్
వాదం బేటికి భక్తరక్షణపరత్వంబున్ బ్రదర్శింపుమా. 39

శ్లో. ఈశాన స్తవ దివ్యనామని రుచిం వేద స్స్వయం చాఽద్రిజా
త్వద్బాణస్య గతిం వివేద సకలాం కాకః కృతాఽఽగో భరః
జానాతీశ విభీషణ స్తవ కృపాం సత్యం నవావేద్మ్యహం
భక్తత్రాణపరాయణత్వ మధునా మయ్యాశు సత్యం కురు॥

మ. భవశర్వాణి యెఱింగినారు ఘనమౌ త్వన్నామమాధుర్యమున్
మివులన్ గాక యెఱుంగు నీశరము పూనిక్కన్ నీకృపాపూర్తి దా
నవుఁడే యయ్యు విభీషణుం డెఱుఁగుఁ గావన్ నేను సత్యం బిదో
భవవిధ్వంసక ! భక్తరక్షణపరత్వంబున్ బ్రదర్శింపుమా. 40

శ్లో. మర్త్యత్వం భువి దుర్లభం ద్విజజను స్తత్రాఽపి కృచ్ఛ్రం పరం
వర్షే భారతనామ్ని జన్మచ సురై రాంకాక్ష్యతే సంతతమ్
త త్సర్వం మమ దాతు రద్య భవతః కింవాఽద్య దాస్యామ్యహం
భక్తత్రాణపరాయణత్వ మధునా మయ్యాశు సత్యం కురు॥

మ. నరజన్మం బతిదుర్లభంబు ధరణిన్ దానన్ ద్విజత్వం బవన్
మఱియుం దుర్లభ మెద్ది భారతమునన్ జన్మింపఁ గాంక్షింతు రా
సురలున్ నా కవి యెల్ల నిచ్చితివి నే నోచ్యుండ నే మిచ్చెదన్
వరదా ! నాయెడ భక్తరక్షణపరత్వంబున్ బ్రదర్శింపుమా. 41

శ్లో. మాభూన్మే తవ పాదపద్మవిముఖై స్సంగో వృథాజీవనై
ర్జన్మైత న్నరలోకభాజి సఫలం యై ర్న క్రియే తాఽంజసా
భక్తానాం తవ దాస్య మిచ్ఛతి మన స్త ద్దేహి మే సాంప్రతం
భక్తత్రాణపరాయణత్వ మధునా మయ్యాశు సత్యం కురు॥

శా. లేకుండన్వలె నీపదాబ్జవిముఖాళీసంగ మెన్నండు నే
నాకాంక్షింతుఁ గృతార్థజన్ములగు నీయత్యంతభక్తాళికిన్
మీఁకన్ సేవ యొనర్ప నాకది వడిన్ బ్రేమన్ ఘటింపింపుమన్
వైకుంఠాధిప! భక్తరక్షణపరత్వంబున్ ప్రదర్శింపుమా. 42

శ్లో. జ్ఞాత స్తారకనామమంత్రమహిమా వాల్మీకినా కృత్స్నశః
ప్రాప్తః పావనపాదరేణువిభవ శ్చాఽహల్యయా తే విభో
దృష్టం సత్యవచః ప్లవంగవిభునా నైతే మయా వీక్షితాః
భక్తత్రాణపరాయణత్వ మధునా మయ్యాశు సత్యం కురు॥

మ. ఎఱుఁగున్ దారకనామమంత్రమహిమం బెంతేని వాల్మీకి తాఁ
బొరసెన్ గౌతమపత్ని నీపదరజఃపుణ్యంబునన్ సంపదల్
మఱి కీశుఁ డెఱుంగు నీనిజము నే లక్షింప లేదివ్వియున్
ద్వరలో నాపయి భక్తరక్షణపరత్వంబున్ ప్రదర్శింపుమా. 43

శ్లో. తీర్థానా మవగాహనం నతు కృతం నేష్టంచ పూర్తాఽఽదికం
గోభూస్స్వర్ణవరాన్నపానశయనశ్రీమూర్తిదానాదికమ్
నైవేహాఽచరితం మయా రఘుపతే త్వత్పాదపూజాఽపివా
భక్తత్రాణపరాయణత్వ మధునా మయ్యాశు సత్యం కురు॥

మ. మునుఁగన్ లే దొకతీర్థ మందయిన లేఁ బూర్తాదులన్ సల్ప నెం
దును భూస్వర్ణవరాన్నపానశయనాదుల్ దానముల్ సేయ నో
యనఘా! తావకపాదపద్మభజనం బైనన్ గడున్ లేదు నా
పనటన్ దీర్చి భక్తరక్షణపరత్వంబున్ ప్రదర్శింపుమా. 44

శ్లో. వందే రామ ! తవాంఘ్రిపద్మయుగళం వందారుబృందావనం
వందే సేవకకల్పభూజ మనిశం వందే విముక్తిప్రదమ్
వందేఽహం మునిమానసాబ్జనిలయం వందే ప్రపన్నాశ్రయం
భక్తత్రాణపరాయణత్వ మధునా మయ్యాశు సత్యం కురు॥

మ. శ్రితకల్పాగము ముక్తిదంబు మునిరాట్చిత్తాబ్జసంవాసమున్
నతలోకావనదక్షమున్ మతి ప్రపన్నార్తిఘ్న మంచు న్వడిన్
నతి గావించెద నీపదాబ్జమునకున్ మన్నించి మత్ప్రార్థనం
తతి పోకార్చి భక్తరక్షణపరత్వంబున్ బ్రదర్శింపుమా. 45

శ్లో. ప్రహ్లాదశ్చ విభీషణః పవనభూ ర్గాంగేయరుక్మాంగదా
వైదేహీ భరతశ్చ నారదశుకవ్యాసాంబరీషోద్ధవాః
తే భక్త్యైవ తవప్రసాద మగమం స్తాం భక్తిమే వార్థయే
భక్తత్రాణపరాయణత్వ మధునా మయ్యాశు సత్యం కురు॥

మ. అలప్రహ్లాదవిభీషణానిలసుత వ్యాసాంబరీషోద్ధవుల్
లలి రుక్మాంగదభీష్మనారదశుకుల్ వైదేహియున్ భక్తినే
యలఘుల్ గాంచిరి నీప్రసాదమును నే నద్దానిచే కోరి నిన్
దలంతు న్నిత్యము భక్తరక్షణపరత్వంబున్ ప్రదర్శింపుమా. 46

శ్లో. జన్మారభ్య తవాఽఽహ్వయంచ సుతరాం విద్వేషిణాం దుర్హృదాం
పాపానామపి భక్తదుర్లభ మహో నైజం పదం దత్తవాన్
త్వాం నిత్యం జపతాం సతాం కి మథ నిర్ణీతం పదం బ్రూహి మే
భక్తత్రాణపరాయణత్వ మధునా మయ్యాశు సత్యం కురు॥

మ. జననం బాదిగ నీదు పేరనిన విస్తారంబు ద్వేషించు దు
ర్జనులన్ జేర్చితి భక్తదుర్లభము త్వత్స్వస్థానమున్. నిత్యమున్
నిను డెందాన జపించువారలకు నిర్ణీతం బదే స్థానమో ?
ప్రణతా ! తెల్పవె? భక్తరక్షణపరత్వంబున్ బ్రదర్శింపుమా. 47

శ్లో. భూపుత్రీసహితం ప్రసన్నహృదయం శత్రుంజయాఖ్యే ద్వీపే
యానే భవ్యనృపాసనే మణియుతే స్థిత్వా ఽభిషేకోత్సవే
ఆయాంతం కపిమర్త్యసైన్యసహితం సేవే భవంతం సదా
భక్తత్రాణపరాయణత్వ మధునా మయ్యాశు సత్యం కురు॥

మ. వరశత్రుంజయనా రణేంద్రమున భాస్వద్రత్నపీఠంబునన్
ధరణీపుత్రికతో ముదంబు గనరన్ బట్టాభిషేకాప్తికై
వరశాఖామృగసైన్యముల్ వెనుకొనన్ భ్రాజద్గతిన్ వచ్చు నిన్
వరదా! గొల్చెద భక్తరక్షణపరత్వంబున్ బ్రదర్శింపుమా. 48

శ్లో. ఉద్యద్భానుసహస్రతుల్యమకుటం సాంద్రద్విరేఫాలకం
విభ్రాజన్మణికుండలాంచితశ్రుతిం చాఽఽరుపక్వబింబాధరమ్
నేత్రోన్మీలనిమీలయో ర్నరహరే మే ద్యోతతాం త్వన్ముఖం
భక్తత్రాణపరాయణత్వ మధునా మయ్యాశు సత్యం కురు॥

మ. తరుణాదిత్యసహస్రభాస్వర శిరస్త్రాణంబు నీలాలకం
బురువజ్రాంచితకర్ణవేష్టనము బింబోష్ఠంబు నా నీముఖం
బౌరి నా కన్నులు మూసినన్ దెఱచినన్ ద్యోతించుఁగా నిప్పుడున్
వరదా! శీఘ్రము భక్తరక్షణపరత్వంబున్ బ్రదర్శింపుమా. 49

శ్లో. త్వత్కార్యం నిజసంశ్రితార్తిహరణం ముఖ్యం త్వమేవోక్తవాన్
త్వద్భక్తాస్తు ఖలైః కిలార్దితతమా సీదంత్యనన్యాశ్రయాః
క్వాఽఽసీ స్త్వం స్వజనం విహాయ గదితం విస్మృత్య సీతాపతే
భక్తత్రాణపరాయణత్వ మధునా మయ్యాశు సత్యం కురు॥

మ. శ్రితసంత్రాణము ముఖ్యకార్య మని కూర్మి న్నీవ వాక్రుచ్చవే?
గతి లేకిప్పుడు నీదుభక్తులు ఖలుల్ గారింప దుఃఖింతురో నీ
వరితిన్ దోఁచి త్వదీయులన్ విడిచి యేవంకన్ వసింతీవహో!
ప్రతిపాలింపక భక్తరక్షణపరత్వంబున్ బ్రదర్శింపుమా 50

శ్లో. క్షీరే సర్పిరి వాఽఖిలాఽఽత్మని భవాన్ స్థిత్వా ఽంతరే నిర్మలో
భక్తాఽభక్తజనం వివేద భగవ న్నన్యై ర్నవిజ్ఞాపితః
త్వత్సేవాపరతంత్ర మన్యవిముఖం కి మ్మా ముపేక్ష్యస్థితో
భక్తత్రాణపరాయణత్వ మధునా మయ్యాశు సత్యం కురు॥

మ. పాల న్నేయివలెన్ సమస్తభువనవ్యాప్తుండవై భక్తులో
కాలిన్ దద్వ్యతిరిక్తులన్ దెలియు నీవప్పా! భవత్పాదసే
వాలగ్నాత్ముఁడ నన్యదూరు నను భావ్యంబే యుపేక్షింపఁగా
వాలాయంబుగ భక్తరక్షణపరత్వంబున్ బ్రదర్శింపుమా. 51

శ్లో. త్వత్పాదాఽబ్జసమర్చనే తవ యశస్సంకీర్తనేవాఽన్వహం
ధ్యానే మూర్తిసమీక్షణే ప్రణమనే శక్తిః కుతోజాయతే
అంతర్యామిణ మంతరేణ భగవం స్తత్త్వేన దోషో న మే
భక్తత్రాణపరాయణత్వ మధునా మయ్యాశు సత్యం కురు॥

మ. తలఁపన్ గోటినియంతయైన జగదంతర్యామి వీ వీవు కే
గలుగంజాలునె? శక్తి నీచరణయుగ్మంబున్ భజింపంగ నిన్
దలఁపన్ గీర్తన సేయ మ్రొక్కఁగ నవాతప్పేమియున్ లేద యా
బలమున్ నా కిడి భక్తరక్షణపరత్వంబున్ బ్రదర్శింపుమా. 52

శ్లో. విజ్ఞాప్యం శృణు దేవ మే ఽఖిలవచ స్సంత్యజ్య కార్యాంతరం
కించి న్నైవ కృతం కదాఽపి సుకృతం తత్తే ఽనుకంపా కథమ్
త్వచ్చిత్తం మమ భాగ్య మీశ బహునో క్తేనేహ కింవా ఫలం
భక్తత్రాణపరాయణత్వ మధునా మయ్యాశు సత్యం కురు॥

మ. పెఱకార్యంబుల వీడి విన్ముప్రభుడు నావిజ్ఞాపనం బెల్ల నో
వరదా! చేయఁగ లేదు నే సుకృత మల్పంబైన నెన్నండు దే
వరచిత్తంబున నాదుభాగ్యమున బల్ వాక్యంబు లేలయ్యా? త్వ
త్కరుణం గాపుము భక్తరక్షణపరత్వంబున్ బ్రదర్శింపుమా. 53

శ్లో. ఆయు స్స్వల్ప మతీవ తత్రి భగవ న్నర్ధం గతం నిద్రయా
వ్యర్థం బాల్యకుమారతాముఖవయో ఽవస్థాభి రర్ధం తతః
సాఫల్యం కురు కించి దస్తి యది భో తస్య త్వ మద్యప్రభో
భక్తత్రాణపరాయణత్వ మధునా మయ్యాశు సత్యం కురు॥

మ. అలుపం బాయువు, నిద్రలోన వృథగా వర్ధంబు పోయెన్, పదిన్
బాలిపోయెన్ మతి బాల్యయౌవనవయోభుక్తిన్ సగం బందులో
కల దే శేషము యింక దానికయినన్ గల్పించి సాఫల్యమున్
బలుపం జెందఁగ భక్తరక్షణపరత్వంబున్ బ్రదర్శింపుమా. 54

శ్లో. ఐశ్వర్యాతిమదాంధత స్సదసతాం జ్ఞానే ఽక్షమా న్మాయిన
స్స్వార్థా ఽఽసక్తతమా న్కఠోరహృదయా న్సద్వంచనే దీక్షితాన్
మా సేవే ప్రభుశబ్దవాచ్యకుమతీన్ సంత్యజ్య చ త్వాం సదా
భక్తత్రాణపరాయణత్వ మధునా మయ్యాశు సత్యం కురు

మ. సదయా! మత్తమదాంధులన్ గఠినులన్ సద్వంచనాదీక్షితుల్
సదసజ్జ్ఞానవిహీనులన్ నిరతమున్ స్వార్థైకసక్తాత్ములన్
గద? భూపాలుర వారిసేవనము నేఁ గావింప నిత్యంబు నీ
పదమే పట్టెద భక్తరక్షణపరత్వంబున్ బ్రదర్శింపుమా. 55

శ్లో. నానాయోనిసహస్రజన్మదురితా త్క్లిశ్యామి సృష్ట్యాది త
స్త్వత్కారుణ్యవశేన జన్మని మమ ప్రాప్తేహ భక్తి ర్హరే
త్వయ్యానందమయే ఽద్య తామతిదృఢాం కృత్వా ఽనుగృహ్ణీష్వ మాం
భక్తత్రాణపరాయణత్వ మధునా మయ్యాశు సత్యం కురు॥

మ. అలసృష్ట్యాదిగ జన్మకోటిదురితాత్యంతార్తిఁ జేఁ గుందుచో
నలమెన్ నీకృపచేఁ జిత్త మిప్డు భవదీయానందరూపంబుపై
లలి నాభక్తి స్థిరత్వమున్ బడసి గ్రాలన్ జేసి నన్ బ్రోవ నీవ
దలఁతున్ నిత్యము భక్తరక్షణపరత్వంబున్ బ్రదర్శింపుమా. 5

శ్లో. లోకే త్వర్థవిహీన మన్యగుణినం దేవో౽పి నో వీక్షతే
హ్యేత త్సత్య మహో కరోతిహి భవాన్ లోకాపవాదం ధ్రువమ్
నోచే న్మాం కి ముపేక్షసే తవ పదో స్సేవా౽ర్థినం నిర్ధనం
భక్తత్రాణపరాయణత్వ మధునా మయ్యాశు సత్యం కురు॥

మ. గొనము న్నన్ ధనహీనుఁ డైనయెడ నాగోవింపుఁ డుంగా బాడెఁ డన్
జనవాక్యం బొనరించు మంటివినుమా సత్యంబు లేకున్న నన్
ధనహీనున్ భవదంఘ్రిపద్మభజనానందమున్ వడిన్ బ్రోవవే
వనమాలీ! యిటు భక్తరక్షణపరత్వంబున్ బ్రదర్శింపుమా. 57

శ్లో. త్వత్పాదాంబుజసంభవా త్రిపథగా పాపం హరే త్సేవినాం
త్వన్నాభీకమలోద్భవ శ్శ్రుతధృతిశ్చాయుర్దదాతిస్వయమ్
త్వజ్జాయాచ దిశే త్యఖండవిభవం క స్తే౽స్తి భారో హరే
భక్తత్రాణపరాయణత్వ మధునా మయ్యాశు సత్యం కురు॥

శా. నీపాదాబ్జజయైన గంగ యఘముల్ నిర్మూలముం జేయు నీ
పావం డైన విరించి యాయువు నొసంగున్ భాగ్యంబు చేకూర్చు దా
నాపుణ్యాత్మికయైన నీసతి దేవా! నీకు బర్వేమి? నన్
బాపిం జేకొని భక్తరక్షణపరత్వంబున్ బ్రదర్శింపుమా. 58

శ్లో. త్వ ద్ధ్యాయత్తమతి ర్భవేచ్చ నితరా మగ్రేసరః పార్షదాం
నిర్ధూ యార్జితకల్మషం నిజతనుం భృంగస్తు కీటో యథా
పూతో౽హం తవ పాదపద్మభజనా న్నా౽ద్యా౽పి తత్ప్రాప్తవాన్
భక్తత్రాణపరాయణత్వ మధునా మయ్యాశు సత్యం కురు॥

మ. భవదాయత్తమనస్కుఁ డెల్ల యఘముల్ పాయంగ నీపార్షద
ప్రవరుం డై యలరారుఁ గీటము ద్విరేఫంబట్లు పూతుండ నే
మిత్రులన్ నీ పదవారిజాతభజనన్ కూర్పు లేదట్టి నై
భవ మింకన్? వతి భక్తరక్షణపరత్వంబున్ బ్రదర్శింపుమా. 59

శ్లో. స్వాధ్యాయః క్రతవ స్తప శ్శమదమౌ సత్యంచ తీర్థాఽటనం
త్యాగ శ్శౌచ మనూచకత్వ మృజుతా సత్కీర్తి రర్థాఽదికమ్
న త్వాం సాధయితుం క్షమా రఘుపతే భక్త్యావినా తే పదో
ర్భక్తత్రాణపరాయణత్వ మధునా మయ్యాశు సత్యం కురు॥

మ. తపమున్ సత్యము శౌచ మార్జవము స్వాధ్యాయంబు జన్నంబులున్
గృపయున్ ద్యాగ మనూచకత్వమును సత్కీర్త్యర్థతీర్థంబులున్
జపముల్ శాంతియు భక్తి లేనివైన నిన్ సాధింపఁగా లేవు వి
శ్వపతీ! నాయెడ భక్తరక్షణపరత్వంబున్ బ్రదర్శింపుమా. 60

శ్లో. ఆరాద్దృష్టిపథే ఽవతీర్య కరుణాఽపాంగాఽవలోకేన మే
మా భీ ర్మంద! న విస్మరామ్యపి కదా మద్భక్త మిత్యాదరాత్
మన్మూర్ధ్నీశ! కరాంబుజం కురు హరే నిశ్శేషశోకాపహం
భక్తత్రాణపరాయణత్వ మధునా మయ్యాశు సత్యం కురు॥

మ. త్వరగా నా కగుపించి "మంద! భయ మందంబోకు నే నెన్నఁడున్
మఱవన్ భక్తు" నటంచుఁ బల్కి కర మస్మన్మూర్థమం దుంచి నన్
గరుణాపాంగవిలోకనంబులఁ గనన్ బ్రార్థింతు నెల్లప్డు మం
దరధారీ! వడి భక్తరక్షణపరత్వంబున్ బ్రదర్శింపుమా. 61

శ్లో. త్వత్పక్షాళనపుణ్యవారి సతతం మాల్యంచ మే మస్తకే
మత్కుక్షౌచ నివేదితాన్న మనఘం రూపం దృశో స్తావకమ్
స్యా ద్వైవ దేవ! తతో ఽధికం రఘుపతే న త్వా మహం ప్రార్థయే
భక్తత్రాణపరాయణత్వ మధునా మయ్యాశు సత్యం కురు॥

మ. తలపై దేవర శ్రీపదాబ్జజలమున్ ద్వన్మాల్యమున్, గుక్షి నిం
పలరన్ నీకు నివేదితాన్నమును, నీయాకారమున్ జూపునన్
గలుగం జేయుము నిత్య మే నధికమున్ గాంక్షింప నొండెద్దియున్
బలువా నీ కిది? భక్తరక్షణపరత్వంబున్ బ్రదర్శింపుమా. 62

శ్లో. ఖట్వాంగాఽఽఖ్యమహీపతిస్తు విబుధైర్జ్ఞాత్వాఽల్ప మాయుస్స్వకం
త్వన్నామస్మరణేన దుర్లభపదం ప్రాప్తో ముహూర్తాంతరే
ఆబాల్యా త్తవ నామకీర్తనపరో నాఽద్యాఽపి ప్రాప్తోఽస్మ్యహం
భక్తత్రాణపరాయణత్వ మధునా మయ్యాశు సత్యం కురు।

మ. కడు స్వల్పం బిఁక నాయు వంచెఱిఁగి యాఖట్వాంగభూభర్త దాఁ
బడసెన్ దివ్యపదంబు మూహుతమునన్ ద్వన్నామమంత్రస్మృతిన్
గడఁకన్ దావకనామకీర్తనము నేఁ గావించు చాబాల్యమున్
బడయన్ లే దది భక్తరక్షణపరత్వంబున్ బ్రదర్శింపుమా. 63

శ్లో. భూరేణూన్ పయసాం కణాంశ్చజలధే స్తారాశ్చ భంగాన్బహూన్
సంఖ్యాతుం భువి కేచి దద్య ప్రభవ స్సంత్యేవ లోకోత్తరాః
కృత్స్నం లోకమలాపహారి చరితం గాతుం న కోఽప్యస్తి తే
భక్తత్రాణపరాయణత్వ మధునా మయ్యాశు సత్యం కురు॥

మ. ధరణీరేణువులన్ బయోధియలలన్ దారాసమూహంబు పు
ష్కరభిందూత్కరమున్ గణింపఁగల ప్రజ్ఞావంతు లున్నారు త్వ
ద్వరకల్యాణగుణప్రపూర్ణచరితన్ వర్ణింప సర్వంబు ను
ర్వరలేఁ డొక్కఁడు భక్తరక్షణపరత్వంబున్ బ్రదర్శింపుమా. 64

శ్లో. స్వేషాం దాస్యసి సంపదో బహుతరా స్సంసేవినాం దుర్లభా
స్స్వామి న్నిస్స్వఇ వాఽద్య తిష్ఠసి కథం ద్రక్ష్యామిభక్తోఽప్యహమ్
క్రీడ న్యోగసముద్భవైశ్చ విభవై ర్మాం తోషయేహోత్సవైః
భక్తత్రాణపరాయణత్వ మధునా మయ్యాశు సత్యం కురు॥

మ, దయఁ గల్గింతువు దివ్యసంపదల నీదాసాళికి న్నిస్స్వుఁ డ
ట్లయి యీవుండఁగ నెట్లు చూడఁగల నే నయ్యున్ భవద్భక్తుఁడన్
రయమారన్ భవదీయయోగవిభవప్రాగ్భారమున్ జూపి నా
దయుతుం జేయుచు భక్తరక్షణపరత్వంబున్ బ్రదర్శింపుమా. 65

శ్లో. త్వత్పాదాబ్జ సమర్చనేన న వినా కాంక్షే శ్రియం భూమిజాం
త్వన్నామస్మరణాఽమృతేన న వినా యాచే సుఖంస్వర్గజమ్
త్వత్సౌందర్యవిలోకనేన న వినా కాంక్షేఽపి ముక్తిం హరే
భక్తత్రాణపరాయణత్వ మధునా మయ్యాశు సత్యం కురు॥

మ. వడయన్ గోరను నీపదార్చనవినా భాగ్యంబు లీభూమిపై
నడుగన్ నీశుభనామమున్ విడిచి సౌఖ్యం బొందు స్వర్గంబునన్
గడకన్ దావకసుందరాస్యము వినా కాంక్షింప మోక్షంబు తో
డ్పడి నన్ జేకొని భక్తరక్షణపరత్వంబున్ బ్రదర్శింపుమా. 66

శ్లో. అంహోభూమి రజామిళాఖ్యమనుజో విప్రోఽపి దాసీసఖ
స్స్వం వృత్తించ కులం విహాయ భగవ న్నంతే స్వకీయాత్మజమ్
శ్రీనారాయణనామధేయ మగమ త్స్మృత్వా త్రి రుచ్చైఃపదం
భక్తత్రాణపరాయణత్వ మధునా మయ్యాశు సత్యం కురు॥

మ. ధరణీదేవుఁడె యయ్యు వృత్తి కులమున్ దాసీసఖత్వంబునన్
వఱదన్ గల్పి యజామిళుండు ఖలుఁ డంతంబందు ముమ్మాఱు త
ద్వరనారాయణనామసూనుఁ బిలిచెన్ బ్రాపించె ? స్థానమున్
వరదా ! నాయెడ భక్తరక్షణపరత్వంబున్ బ్రదర్శింపుమా 67

శ్లో. సామాన్యప్రభవోఽపి చాశ్రితజనో న త్యాజ్య ఇత్యాదరా
ద్దోషేసత్యపి తత్ర తేగుణపరా స్సంప్రాయం త్వ్యన్నతిమ్
భక్తం త్వం నవిముంచసీతి జగతాం కిం కథ్యతా మీశ్వరో
భక్తత్రాణపరాయణత్వ మధునా మయ్యాశు సత్యం కురు॥

శా. సామాన్యప్రభువైన నాశ్రితుని దోషవ్రాతయుక్తున్ గుణం
బేమాన్నన్ గ్రహియించి యున్నతినిఁ బొందింతున్ గదా యింక నిన్
ప్రేమన్ గొల్చెడిభక్తు వీడవని వేఱె చెప్పఁగా నేల? దే
వా ! మన్నింపుము భక్తరక్షణపరత్వంబున్ బ్రదర్శింపుమా. 68

శ్లో. మూర్ధ్నా త్వాం ప్రణిపత్య సంతత మహం యాచే కృపావారిధిం
విశ్వస్మి న్పరిదృశ్యమాన మఖిలం త్వద్రూపమేవేతి ధీః
నిర్విఘ్నం మమచే ద్భవామి భగవ న్ముక్త స్తథాశాధి మాం
భక్తత్రాణపరాయణత్వ మధునా మయ్యాశు సత్యం కురు॥

మ. కరుణావార్ధి! శిరంబు వంచి వినతి న్గావించి ప్రార్థింతు వి
స్తరమా నీపరిదృశ్యమానమగు విశ్వం బిద్ది సర్వంబు దే
వరరూపంబను బుద్ధి నిమ్ము వడి నే బ్రాపింతు మోక్షంబు స
త్వరతన్ దానన; భక్తరక్షణపరత్వంబున్ ప్రదర్శింపుమా. 69

శ్లో. తుభ్యం వందన మస్తు సర్వజగతాం స్రష్ట స్స్వయంజ్యోతిషే
సృష్ట్వేదం సకలం భవాన్ రఘుపతే తస్మిన్ ప్రవిష్ట స్స్వయమ్
చిచ్ఛక్త్యా పరిచేతయ స్యవికృత స్తత్త్వంతు కో వేత్తి తే
భక్తత్రాణపరాయణత్వ మధునా మయ్యాశు సత్యం కురు॥

మ. జగమున్ సృష్టి యొనర్చు నీ కిదె నమస్కారంబు జ్యోతిర్మయా!
జగముం జొచ్చి ప్రపూర్ణుడౌచు నిజచిచ్ఛక్తిన్ సమస్తంబు నొం
దగఁ జైతన్యము నిర్వికారుఁడగు నీతత్త్వంబు గన్పట్టఁగాఁ
దగువాఁ డెవ్వఁడు? భక్తరక్షణపరత్వంబున్ బ్రదర్శింపుమా॥ 70

శ్లో. భర్తారం యువతీవ పుణ్యచరితా కామాతురా ప్రోషితం
వత్సం గౌ ర్నవసూత మంబుదచయం తృట్పీడిత శ్చాతకః
కాంక్షం తీశ యథాఽహమ ప్యనుదినం త్వాంద్రష్టు మత్యుత్సుకో
భక్తత్రాణపరాయణత్వ మధునా మయ్యాశు సత్యం కురు॥

మ. నవనీతంబగు దూడ సావు మతి పుణ్యస్త్రీ మనోభర్తయా
యువతీరత్నము ప్రోషితాత్మవరు నత్యర్థాతృట్పీడితం
బవు చాతక మంబుదంబువలె నిత్యం బేను గాంక్షింతు మా
ధవ! నిం జూడఁగ భక్తరక్షణపరత్వంబున్ బ్రదర్శింపుమా. 71

శ్లో. లోకేఽస్మి న్నహి దృశ్యతే తవ తనో ర్వ్యక్తి స్సుపుణ్యాత్మభిః
కిం త్వేవం ప్రవదంతి సజ్జనతనో ర్వ్యాజేన దృష్టా భవేత్
తత్సంగశ్చ తదీక్షణంచ న లభే తానుగ్రహో త్తే ఽన్యథా
భక్తత్రాణపరాయణత్వ మధునా మయ్యాశు సత్యం కురు॥

మ. వరదా ! పుణ్యులకైన గాదగు స్వరూపవ్యక్తి గన్పింప ది
ద్ధరణిన్ సజ్జనరూపధారి వని దద్జుల్ ప్రసంగింతురి త
ద్వరసందర్శనసంగమాదు లవి నీవాత్సల్యమూలంబు లా
వరమున్ గోరెద భక్తరక్షణపరత్వంబుగా ప్రదర్శింపుమా. 72

శ్లో. భూలక్ష్మ్యాదిభి రన్వహం తవ పదో స్సంవాహనే స్పర్ధితం
మాం వీక్ష్య స్మితసుందరాననరుచిః పర్యాయసేవాం దిశ
త్వత్సేవాపరితుష్ట ఇత్యపి వద న్నానంద యేమం జనం
భక్తత్రాణపరాయణత్వ మధునా మయ్యాశు సత్యం కురు॥

మ. సతతమ్ముగా ధరణీరమాసతులతో స్పర్ధింతు నీసేవకై
స్మితవక్త్రమ్మున నన్నుఁ గాంచి యొకటన్ సేవింపఁ జోటిచ్చి "కాం
చితిఁ దుష్టిన్ భవదీయసేవ" నని నన్ జేయంగదే మోదితుగా
బలితుగా మాధవ ! భక్తరక్షణపరత్వంబున్ బ్రదర్శింపుమా॥ 73

శ్లో. మచ్చిత్తే తవ పాదపద్మయుగళం ధ్యాయామి లక్ష్మీపతే
మద్భక్తో ఽయమితి త్వదీయహృదయే జానీహి మా మన్వహమ్
తన్మాత్రేణ భవా మ్యహం రఘుపతే త్వత్పార్శ్వదా మగ్రగో
భక్తత్రాణపరాయణత్వ మధునా మయ్యాశు సత్యం కురు॥

శా. నాచిత్తమ్మున నీపదాబ్జయుగముగా ధ్యానింతు నెల్లప్పుడున్
నీచిత్తమ్మున "వీఁడు భక్తుఁడు నమున్ సేవించు" నం చెంచి సం
కోచం బూడ్చెదవేని పార్శ్వదుల నొక్కండం డౌదుఁ దన్మాత్ర, దే
వా ! చిదూత్రిక ! భక్తరక్షణపరత్వంబుగా ప్రదర్శింపుమా. 74

శ్లో. కిం వర్ణేన కి మాశ్రమేణ వయసా కిం వాధికారేణవా
కిం రూపేణ కళాసలీలవచనై ర్ధీవైభవేనాఽపి కిమ్
యో భూమౌ నరజన్మభాగపి హరే న త్వాంతు సేవేత చేత్
భక్తత్రాణపరాయణత్వ మధునా మయ్యాశు సత్యం కురు॥

మ. కలయుం రూపము వర్ణ మాశ్రమము వాక్చాతుర్యమున్ మేధయుం
బలముం బ్రక్రియయుం వయస్సు గలలాభం బేమి ? ధాత్రీస్థలిన్
దిలకించా నరజన్మ మెత్తియును నిన్ సేవింపలేకున్నఁ ద
త్ఫలముం గూరిచి భక్తరక్షణపరత్వంబుం బ్రదర్శింపుమా 75
ప్రక్రియ=అధికారము.

శ్లో. సంసారే నరతోఽపి యస్య హృదయం త్వత్పాదలగ్నం భవే
త్సోఽయం దేవమనుష్యకిన్నరమహానాగైశ్చ సంపూజితః
నిత్యానందయుత స్త్వదీయసవిధే ముక్త స్సదా సంవసేత్
భక్తత్రాణపరాయణత్వ మధునా మయ్యాశు సత్యం కురు॥

మ. ధర సంసారనిమగ్నుఁడయ్యును భవత్పాదాబ్జలగ్నాత్ముఁడౌ
నరుఁ డెన్నఁ బరదేవకింపురుషగంధర్వాళికిం బూజ్యుఁడై
పరమానందముతోడ నీదరిని సంవాసించు ముక్తుండుగాఁ
ద్వర నాయందున భక్తరక్షణపరత్వంబున్ బ్రదర్శింపుమా 76

శ్లో. సర్వం నశ్యతి సార్వభౌమపదవీస్వర్గాఽఽధిపత్యం పరం
కిం బ్రూయాం బహునా కిమేత దఖిలం నశ్యే జ్జగచ్ఛ్రీపతే
ఏకా తిష్ఠతి తావకాంఘ్రియుగళే భక్తి స్సదా నిశ్చలా
భక్తత్రాణపరాయణత్వ మధునా మయ్యాశు సత్యం కురు॥

మ. సకలంబున్ జెడు సార్వభౌమపదవీస్వర్గాధిపత్యాదిగా
వికలంబయ్యెడు నిజ్జగం బఖిలముం జెప్పంగ వాక్రువ్వ ? నీ
యుగళాంఘ్రిసరోజభక్తి యది నిత్యంబుగా స్థిరం బౌను నం
దకధారీ ! వడి భక్తరక్షణపరత్వంబున్ బ్రదర్శింపుమా. 77

శ్లో. గాత్రం చాఽఽమయపూరితం మమ మనస్త్వత్యంతమూఢం ప్రభో
అన్యా మత్ప్రకృతిశ్చ దేహజసుఖం త్యక్తుం న మేఽస్తి క్షమా
కిం కుర్యా మహ మీశ తావకకృపాసారేణ సంరక్ష మాం
భక్తత్రాణపరాయణత్వ మధునా మయ్యాశు సత్యం కురు॥

మ. తనువుం జూడఁగ రోగపూరితము, చిత్తంబెన్న మూఢంబు, నేఁ
దనుసౌఖ్యంబుల వీడఁజాల నతిచిత్రంబౌ స్వభావంబుతో
ననఘా ! యేమి యొనర్తు నింకఁ గృప నిండారంగఁ బ్రోవందగున్
వనటన్ మాన్పి భక్తరక్షణపరత్వంబున్ ప్రదర్శింపుమా 78

శ్లో. ధన్యోఽహం తు య దీదృశీ తవ పదో ర్భక్తి ర్దృఢా శ్రీపతే
జాతా సైవ మమాఽస్త్వజ ప్రతిభవం భావత్కకారుణ్యతః
కిం ప్రార్థ్యం వద సారవేదిభి రితో జ్ఞానస్య ముఖ్యం ఫలం
భక్తత్రాణపరాయణత్వ మధునా మయ్యాశు సత్యం కురు॥

మ. స్థిరమౌ భక్తి భవత్పదాంబుజములన్ సిద్ధించె ధన్యుండఁ జే
కుఱుఁగాక దియెల్లజన్మముల నాకున్ ద్వత్కృపాపూర్తిచే
ధర సారజ్ఞులు గోరు జ్ఞానఫల మేతద్భక్తియే గాద ? శ్రీ
ధరణీనాయక ! భక్తరక్షణపరత్వంబున్ ప్రదర్శింపుమా. 79

శ్లో. బాలో ఽత్యంతదురుక్తిభి ర్హతమనా మాతు స్సపత్న్యాః పరం
త్యక్త్వా గేహ మవాఽఽప్య మోక్షపదవీ మాత్తానపాదీ రయాత్
షణ్మాసై స్తవ భవ్యభూరి కరుణాం లబ్ధ్వా ఽభవ చ్ఛాశ్వతో
భక్తత్రాణపరాయణత్వ మధునా మయ్యాశు సత్యం కురు॥

మ. కడు బాలుం డయి మాఱుతల్లినుడువుల్ గష్టంబుగాఁ దోఁచి తా
నడవిం జేరి ముముక్షువై నిలిచి షణ్మాసంబులన్ నీదయన్
జెడరాఁట్టి స్థిరరూపమున్ బడసె నీసేవన్ ధ్రువుం డప్పుడా !
వడి నన్ గైకొని భక్తరక్షణపరత్వంబున్ ప్రదర్శింపుమా. 80

శ్లో. ఓంకారాదిసమస్తవేదనివహం హృత్వా ఽంబుధే రంతరం
ప్రాప్తం సోమకనామఘోరదనుజం హత్వా తదంతర్గతమ్
వేదౌఘం విధయే ఽర్పితం హి భవతా తన్మాత్స్యరూపం భజే
భక్తత్రాణపరాయణ త్వ మధునా మయ్యాశు సత్యం కురు॥

మ. నిగమవ్రాతములన్ హరించి చని మున్నీటిన్ బ్రవేశించి సా
వఁగరాకుండిన సోమకాఖ్యదనుజున్ ఖండించి వేదంబులన్
మిగులన్ ప్రేమను వేధ కిచ్చిన భవన్మీనాకృతిం గొల్తు నిన్
దగులం జేయుచు భక్తరక్షణపరత్వంబున్ ప్రదర్శింపుమా. 81

శ్లో. మంథానం వరమందరాఽగ ముత తన్నేత్రం తు నాగాఽధిపం
కృత్వా క్షీరనిధౌ సురాఽసురగణై ర్నిర్మథ్యమానే ఽంజసా
ఉన్మగ్నం గిరి ముద్ధృతం త్వ మకరో స్త్వత్కూర్మరూపం భజే
భక్తత్రాణపరాయణ త్వ మధునా మయ్యాశు సత్యం కురు॥

మ. కలశాంభోనిధియందు మంథరగిరిన్ గవ్వంబుగా నుంచి నే
ర్పలరన్ వాసుకి త్రాడుగా సలిపి దేవారాతులున్ దేవతల్
చిలుకన్ గ్రుంగినకొండ నెత్తిన భవచ్ఛ్రీకూర్మదివ్యాకృతిన్
దలఁతున్ నిత్యము భక్తరక్షణపరత్వంబున్ ప్రదర్శింపుమా. 82

శ్లో. క్షోణీం వేష్ట్య రసాతలాంతరగతం క్రూరం హిరణ్యాంబకం
హత్వా స్థావరజంగమప్రకరసుస్థిత్యై హరేలీలయా
దంష్ట్రాఽగ్రేణ భువం దధాన మనఘం త్వద్ఘోణిరూపం భజే
భక్తత్రాణపరాయణ త్వ మధునా మయ్యాశు సత్యం కురు॥

మ. అవనిం జుట్టి రసాతలాంతరగతుండౌ నాహిరణ్యాక్షుఁ జం
పి వసన్ స్థావరజంగమప్రకరముల్ మేలందఁ శృంగంబునం
దవలీలన్ ధర దాల్చునీదగువరాహాకారమున్ గొల్చెదన్
భవనిర్మూలక! భక్తరక్షణపరత్వంబున్ బ్రదర్శింపుమా. 83

శ్లో. భక్తవ్రాతశిఖామణిం గుణిమణిం గోప్తుం సురార్యర్భకం
హంతుం తత్పితరం హిరణ్యకశిపుం శత్రుం సభాస్తంభజమ్
సర్వవ్యాప్తినిదర్శకం నరహరే త్వన్మిశ్రరూపం భజే
భక్తత్రాణపరాయణత్వ మధునా మయ్యాశు సత్యం కురు॥

మ. అమరార్యార్భకు భక్తవర్యు గుణిఁ బ్రహ్లాదున్ వడిన్ బ్రోవఁగాఁ
కుమతిన్ దజ్జనకున్ హిరణ్యకశిపున్ గూల్పంగ స్తంభంబునన్
నృమృగేంద్రాకృతిఁ బుట్టి సర్వమయతన్ జెల్లించు నీరూపమున్
దమిఁ బూజించెద భక్తరక్షణపరత్వంబున్ బ్రదర్శింపుమా. 84

శ్లో. దైత్యేంద్రాఽఽహృతరాజ్య మింద్ర మవితుం తస్యానుజత్వం భజ
న్భిక్షిత్వా త్రిపదం బలిం సకపటం వ్యాప్నోశ్చ లోకత్రయమ్
యద్రూపేణ త్రివిక్రమాహ్వయజుషో తద్రూపిణం త్వాం భజే
భక్తత్రాణపరాయణత్వ మధునా మయ్యాశు సత్యం కురు॥

మ. బలిదైత్యాహృతరాజ్యుఁడై పగచు జంభారిన్ వడిన్ బ్రోవ న
ర్మిలిఁ దద్భ్రాతఁగఁ బుట్టి మూఁడుపదముల్ భిక్షించి ముల్లోకముల్
గలయన్ బ్రాకిన యాత్రివిక్రమపరబ్రహ్మంబు నిన్గొల్తుఁ గొం
దలమున్ బాపుచు భక్తరక్షణపరత్వంబున్ బ్రదర్శింపుమా. 85

శ్లో. భూదేవప్రభవోఽపి హైహయపతే ర్దోర్దండసాహస్రకం
ఛిత్వా నైజపరశ్వధేన నిఖిలాన్ త్రిస్సప్తకృత్వో నృపాన్
హత్వాఽదా దథ కశ్యపాయ ధరణిం య స్తం భవంతం భజే
భక్తత్రాణపరాయణత్వ మధునా మయ్యాశు సత్యం కురు

మ. ధరణీదేవుఁడవయ్యు హైహయునిదోర్దండంబులన్ వేయిటిన్
వరుసన్ ద్రుంచి పరశ్వధంబున నృపవ్రాతంబు మువ్వేడుసా
ర్లురులీలన్ వధియించి కశ్యపున కీయుర్విన్ బ్రసాదించు శ్రీ
వరు నిన్ గొల్చెద భక్తరక్షణపరత్వంబున్ బ్రదర్శింపుమా. 86

శ్లో. బ్రహ్మప్రార్థనయా దశాఽస్యనిధనే సాక్షా ద్రఘూర్గోత్రజ
స్సత్త్వాత్మా పితృవాక్యపాలనపరో హత్వా ఖలా నత్యయే
స్వస్థానం గమితోఽపి భక్తనివహాం మర్త్యాదికీటాంతకం
భక్తత్రాణపరాయణత్వ మధునా మయ్యాశు సత్యం కురు॥

మ. సరసీజాతభవుండు వేఁడ రఘువంశంబందు జన్మించి స
చ్చరితుండై పితృవాక్యపాలనమునన్ ధన్యత్వముం గాంచి ము
ష్కరునిన్ రావణుఁ జంపి యెల్లరను స్వస్థానంబునన్ జేర్చి తా
దర మేపారఁగ భక్తరక్షణపరత్వంబున్ బ్రదర్శింపుమా. 87

శ్లో. లీలామానుషవిగ్రహౌ భువి యదో ర్వంశోద్భవౌ భ్రాతరౌ
హత్వా కంసముఖాఽమరారినివహాం భూభారనిర్వాపకౌ
నామ్నా శ్రీబలరామకృష్ణవిదితౌ దేవౌ భజే తేఽంశజౌ
భక్తత్రాణపరాయణత్వ మధునా మయ్యాశు సత్యం కురు॥

శా. నీయంశంబున యాదవాన్వయమునన్ లీలాకృతుల్ దాల్చి దు
ర్మాయాపేయులఁ గంసముఖ్యఖలులన్ మర్దించి భూభారమున్
మాయంజేసిన రామకృష్ణుల మదిన్ ధ్యానింతు నాదోషముల్
బాయంజేయుము భక్తరక్షణపరత్వంబున్ బ్రదర్శింపుమా. 88

శ్లో. పాషండాది సమస్తనాఽస్తికజనై ర్విధ్వంసితం సత్పథం
దృష్ట్వా తన్మతవిభ్రమార్థ మవనౌ వావిశ్య బుద్ధాఽఽత్మనా
బౌద్ధాఖ్యం పరికల్ప్య మాయికమతం తాన్ వంచయంతం భజే
భక్తత్రాణపరాయణత్వ మధునా మయ్యాశు సత్యం కురు॥

మ. ధరఁ బాషండులు నాస్తికుల్ ప్రబలి సన్మార్గంబు మాయించుచున్
మరియున్ దన్మతవిభ్రమంబునకునై బుద్ధుండుగాఁ బుట్టి స
త్వరతన్ మాయికబౌద్ధనామమత మాపాదించి వంచించు శ్రీ
ధరు నిన్ గొల్చెద భక్తరక్షణపరత్వంబున్ బ్రదర్శింపుమా. 89

శ్లో. సాంకర్యే సతి సర్వవర్ణనివహే ఽస్యారూఢఘోటో జవా
న్నిస్త్రింశేన సమస్తసంకరకరాన్ హత్వా కలే రత్యయే
ఆచారా నథ పాలయిష్యసి హరే కల్కిర్భవం స్త్వాం భజే
భక్తత్రాణపరాయణత్వ మధునా మయ్యాశు సత్యం కురు॥

మ. క్షితిపై వర్ణములెల్ల సంకరములై చేటొందఁ గల్క్యాకృతిన్
సితవాహంబున స్వారిగా వెడలి నిస్త్రింశంబునన్ దోషులన్
హృతి నొందించుచు రక్షఁ జేసెదవు సంప్రీతిన్ సదాచారముల్
పతగాగోవాహ ! భక్తరక్షణపరత్వంబున్ బ్రదర్శింపుమా. 90

శ్లో. పాతాళం తవపాద మీశ ! సుతలం జంఘేచ తే జానునీ
చోరూ తే వితలం మహీంతు జఘనం నాభీ విదుస్తే నభః
వక్త్రం తే మహ దామనంతి మునయ స్సత్యంచ శీర్షంతు తే
భక్తత్రాణపరాయణత్వ మధునా మయ్యాశు సత్యం కురు॥

మ. అలపాతాళము నీపదంబు సుతలం బా జానుజంఘల్ తొడల్
తలపోయన్ వితలంబు భూమి కటి యాభ్రం బెన్నఁ ద్వన్నాభి యిం
పలరా ర్మోమె మహర్జగం బనుచు సత్యం బంచుఁ ద్వచ్ఛీర్షముల్
దలఁతు ర్మౌనులు భక్తరక్షణపరత్వంబున్ బ్రదర్శింపుమా. 91

శ్లో. విశ్వస్తోఽహ మహర్నిశం త్రికరణై స్త్వత్పాదపద్మే దృఢం
సత్యం యద్యపి కాంక్షసే తవ హరే శ్రీపాదమూలం భజే
ప్రత్యక్షం భవ మే ఽద్య సర్వవిబుధాః పశ్యంతు సత్యంతు మే
భక్తత్రాణపరాయణత్వ మధునా మయ్యాశు సత్యం కురు॥

మ. సదయా ! నమ్ముచునుంటి నీపదము లశ్రాంతంబు గాఢంబుగా
నది శంకించిన బాస చేసెదను పాదాబ్జంబులన్ బట్టి, ప
క్షైదతనిన్ గనుపింపు నానిజము సంప్రీతిన్ బుధాగ్రేసరుల్
పదురున్ గాంతురు భక్తరక్షణపరత్వంబున్ బ్రదర్శింపుమా. 92

శ్లో. విక్షేపాఽఽవరణాఖ్య శక్తియుగళం సంకల్ప్య సృష్టీచ్ఛయా
సచ్చిత్సౌఖ్యమయం త్వదీయవిభవం సంఛాద్య సీతాపతే
నానా త్వం ప్రతిభాసి మోహశబలం కర్తుం ప్రపంచం విభో
భక్తత్రాణపరాయణత్వ మధునా మయ్యాశు సత్యం కురు॥

మ. జగమున్ మోహము నొందఁజేయుటకుఁ ద్వత్సచ్చిన్ముదాకారముం
మిగులం ఛన్నముఁజేసి యావరణముం విక్షేపముం బూని పొ
ల్పగు నానావిధరూపముల్ వెలయఁగా వ్యాపించినా వంతటం
దగు నిన్నొల్వగ భక్తరక్షణపరత్వంబుం బ్రదర్శింపుమా. 93

శ్లో. వహ్ని స్త్వద్వదనం శశాంకమిహిరౌ నేత్రే నభో మస్తకం
ది క్ఛ్రోత్రద్వితయం కుభృన్మణిగణ స్త్వస్థీని లోమాని తే
వృక్షాద్యా స్తవ వాయవో నరహరే ప్రాణాస్తు రేతో జలం
భక్తత్రాణపరాయణత్వ మధునా మయ్యాశు సత్యం కురు॥

మ. జ్వలనం బాస్యము సూర్యచంద్రులు కనుల్, వాతంబు నీప్రాణముల్
జలముల్ రేతము, శీర్ష మాకసము దిక్చక్రంబు శ్రోత్రంబు ల
స్థులు శైలంబులు భూరుహంబు లవి త్వద్రోమంబు, లంచుం సదా
దలఁతున్ నామది భక్తరక్షణపరత్వంబున్ బ్రదర్శింపుమా. 94

శ్లో. బ్రహ్మాండం తవ మందిరం రఘుపతే మాయాంతు జాయాం విదు
ర్బ్రహ్మాదీం స్తనయాం త్సుతాం త్రిపథగాం శ్రీశంకరం త్వత్సఖమ్
నైర్గుణ్యేఽపి భవా న్నముంచతి భవం కోఽన్యస్త్యజే త్ప్రాకృతో
భక్తత్రాణపరాయణత్వ మధునా మయ్యాశు సత్యం కురు॥

మ. అలబ్రహ్మాండము నీదుమందిరము మాయాదేవి నీజాయ యా
జలజాతాసనుఁ డాత్మజుండు సఖుఁ డాస్థాణుండు త్వత్పుత్రి గం
గ లలిం నిర్గుణుఁ డీవ సంసృతి మానుంగం బ్రాకృతుల్ వీడఁగాఁ
దలఁపుం జేతురె? భక్తరక్షణపరత్వంబుం బ్రదర్శింపుమా. 95

శ్లో. ఆదా వాత్తగుణత్రయ స్త్వ మఖిలం సృష్ట్వా జగ త్పాలయ
న్నంతే హంత వినాశయ స్యహహా తే కిం తేన లాభో భవేత్
ఏకాకీహ నివస్తు ముత్సుకతయా కిం క్రీడసే శ్రీపతే
భక్తత్రాణపరాయణత్వ మధునా మయ్యాశు సత్యం కురు

మ. భువనంబుల్ త్రిగుణాత్మ్ములన్ బొలుపుగాఁ బుట్టించి రక్షించి ప్రా
భవ మొప్పన్ బొలియింతు వీ వహహా! లాభం బేమి? యద్దానిచే
నవురా! యొంటి వసింపవే కిటులు నీ వాటాడునో? యేమొ? చె
ప్పవుగా? మాధవ! భక్తరక్షణపరత్వంబున్ బ్రదర్శింపుమా. 96

శ్లో. మాం త్రాయస్వ రమాపతే కరుణయా కృత్వాఽంజలిం సంతతం
తిష్ఠన్తం న వినా భవంత మలఘుం స్వప్నేఽపి సేవే విభో
పీయూషే సతి కోఽపి నేచ్ఛతి రసం తిక్తం ప్రపాతుం జనో
భక్తత్రాణపరాయణత్వ మధునా మయ్యాశు సత్యం కురు॥

మ. కలనైనన్ ఘను నిన్ను వీడి కొలువన్ గాంక్షింప నొండెవ్వనిన్
నిలుతున్ సంతత మంజలిన్ సలుపుచున్ వేగన్ గృపన్ బ్రోవు నన్
దలపోయన్ సుధ గల్గఁ దిక్త మొకఁడున్ ద్రావంగ నూహించునే?
బలగర్వాపహ! భక్తరక్షణపరత్వంబున్ బ్రదర్శింపుమా. 97

శ్లో. యావ న్మే సుపటు త్వగాదిక మధో యావ న్మనీషా స్థిరా
యావ న్మే గళ మావృణోతి న కఫో దృష్టిశ్చ నో చంచలా
తావ త్సంసృతిరోగభేషజమయీం నామస్మృతిం దేహి మే
భక్తత్రాణపరాయణత్వ మధునా మయ్యాశు సత్యం కురు॥

మ. తను వింకాఁక దృఢంబుగాఁ దనరఁ జిత్తం బద్ది చాంచల్యతన్
గన కెంతాఁకఁ గఫంబు కంఠమున చిక్కం జూడ కెంతాఁకఁ జూ
పును గోల్పోవ దటంతకున్ భవరుజన్ బోఁగొట్టు నీ నామమున్
దనుకం జేయుము భక్తరక్షణపరత్వంబున్ బ్రదర్శింపుమా 98

శ్లో. కేచి త్త్వాం పరమాణు మాహు రపరే ప్రజ్ఞాన మన్యే బుధా
శ్చైతన్యం కతిచి ద్వదంతి భగవం త్సర్వస్య సాక్ష్యాత్మకమ్
నిశ్చిన్వంతి న కేఽపి తత్త్వ మజ తే ఽత స్త్వాం నమామి ప్రభో
భక్తత్రాణపరాయణత్వ మధునా మయ్యాశు సత్యం కురు॥

మ. పలుకున్ నిన్ బరమాణువంచు నొకఁడున్ బ్రజ్ఞాన మం చొక్కఁడున్
దలఁచున్ సంతతసర్వసాక్షివగు చైతన్యంబుగా నిం కొకం
డిల నీతత్త్వము నిశ్చయింపఁగలవాఁ డెందున్ గనన్ రాఁడు కే
వలు నిన్ గొల్చెద భక్తరక్షణపరత్వంబున్ బ్రదర్శింపుమా. 102

శ్లో. జానే త్వాం నిజభక్తరక్షణవిధౌ బద్ధాదరం మానినం
తేనాఽహం భవదీయ మంఘ్రియుగళం బధ్వా దృఢం మానసే
భక్త్యా నిశ్చల మాతనోమి భగవన్ గచ్ఛేః కథం మాం వినా
భక్తత్రాణపరాయణత్వ మధునా మయ్యాశు సత్యం కురు॥

మ. తెలియున్ నాకు స్వభక్తరక్షణవిధిన్ దీక్షించి తీ వంచుఁ ద్వ
ద్విలసత్పాద సరోజయుగ్మకము మచ్చిత్తంబునన్ గట్టి నిన్
దొలఁక న్నిచును భక్తి నెట్టు లిఁక నన్నున్ వీడి పోఁగల్గు దో
బలిభుక్పక్షక! భక్తరక్షణపరత్వంబున్ బ్రదర్శింపుమా. 103

శ్లో. సంసారార్ణవతో ఽద్య పాహి భగవన్ మాం త్వత్పదాఽబ్జాఽ
ఽఽశ్రయం। మత్సర్వావయవేషు సంతమపి నో జానే భవంతం విభో
దృశ్యేనాఖిలవస్తునా పరిణతం జ్ఞాతుం కుత శ్శక్తి మాన్
భక్తత్రాణపరాయణత్వ మధునా మయ్యాశు సత్యం కురు॥

మ. భవపాథోనిధినుండి ప్రోవు మతి నీపాదాశ్రయుం డన్న ని
న్నవలోకింపఁగఁ జాల దేహమున సర్వాంగంబులం దున్న; నీ
భువి సర్వంబున నిండియుండఁ గనఁ జొప్పు న్నెట్లు [illegible]ంగ రమా
ధవ! నిన్ గొల్చెద భక్తరక్షణపరత్వంబున్ బ్రదర్శింపుమా. 104

శ్లో. సారాఽసా[illegible] కలి మనుజం సమ్మానయం త్వ్యత్తమం
య త్త్వ[illegible]మాత్రతో ఽఘ మఖిలం నిర్ధూయ ముక్తో భవేత్
నో జానంతి రహస్య మజ్ఞమనుజా ఏత ద్వృథా శేరతే
భక్తత్రాణపరాయణత్వ మధునా మయ్యాశు సత్యం కురు॥

శా. సారాసారవివేకు లేకలి ప్రశస్తం బంచు నగ్గించ్రు నో
రారన్ నిన్ స్తుతియించినంతటనె మోక్షావాప్తి చేకూరు నం
చా రూఢిన్ గననేర కజ్ఞులు వృథావ్యాపారముల్ గొంద్రు దు
ర్వార ప్రాభవ ! భక్తరక్షణపరత్వంబున్ ప్రదర్శింపుమా. 105

శ్లో. మూఢాత్మాన మహర్నిశం భవసుఖే బద్ధాదరం మాం వృథా
పాండిత్యభ్రమగర్వితం స్వకుశలే మత్తం ముధాఽఽయుర్వ్యయమ్
త్రాతుం కోఽపి న దృశ్యతే త్రిజగతా మేతాదృశం త్వాం వినా
భక్తత్రాణపరాయణత్వ మధునా మయ్యాశు సత్యం కురు॥

శా. బాలుండన్ భవసౌఖ్యలోలుఁడఁ గడున్ బాండిత్యదుర్భ్రాంతి చేఁ
జాలన్ గర్వితుఁడన్ స్వకీయకుశలోత్సాహుండ వ్యర్థాయువున్
బాలింపన్ నను నీవు దక్కఁద్రిజగన్మధ్యంబునన్ లేఁడు దే
వా ! లక్ష్మీధవ ! భక్తరక్షణపరత్వంబున్ బ్రదర్శింపుమా. 106

శ్లో. క్వాఽహం మూఢమతి ర్నిరంతరతపోరూఢాత్మభి ర్యోగిభిః
ప్రాప్యం క్వేతి నచింతయం స్తవ పదం కాంక్షే ఽతి తృష్ణాఽఽతురః
స్వేషాం తచ్చ దదాసిచేతి భగవన్ శంసంతి సంతో ఽధవా
భక్తత్రాణపరాయణత్వ మధునా మయ్యాశు సత్యం కురు॥

మ. ధర మూఢాత్ముఁడ నేను సంతతతపోధన్యాత్ములౌ యోగికిం
బుగు నందంగల స్థానమున్ బడయఁగాఁ గాంక్షింతుఁ జేరాసచేఁ
గరుణన్ భక్తుల కిత్తు వద్ది యని తక్కుండిందురు సత్పూరుషుల్
పరమాత్మా ! యది భక్తరక్షణపరత్వంబున్ బ్రదర్శింపుమా. 107

శ్లో. సంసారాఖ్యమలాపహాం తవ కథాపీయూష [illegible]
ద్యే శృణ్వంతి దినేదినే తు కృతిన స్తే వై కలా[illegible]
నాఽన్యే, య త్క్షణచంచలం నరజనుః కో వా కృతార్థో భవేత్
భక్తత్రాణపరాయణాత్వ మధునా మయ్యాశు సత్యం కురు॥

మ. తతసంసారమలాపహం బగు భవద్గాథాసుధాపానమున్
సతమున్ జేసెడువాఁడె పండితుఁ డిలన్ ధన్యాత్ముఁడున్ వాఁడె యీ
యతినిస్సారమనుష్యజన్మమున ధన్యాత్ముం డెవం డయ్యెడున్
బతగాధీశ! భక్తరక్షణపరత్వంబున్ బ్రదర్శింపుమా. 108

శ్లో. దూరీకృత్య దురంతగ్రామ్యకథనై స్సంగం మనో మామకం
సక్తం త్వచ్చరణారవిందయుగళ ధ్యానామృతాఽఽస్వాదనే
కృత్వా సంసృతితాపజం భయ మపాకుర్వేహి రక్ష ప్రభో
భక్తత్రాణపరాయణత్వ మధునా మయ్యాశు సత్యం కురు॥

మ. మదికిన్ గ్రామ్యవృథాకథాశ్రవణసంబంధంబు లేకుండఁ ద్వ
త్పదపంకేరుహ చింతనామృత రసాస్వాదానురాగంబు చే
గదురం జేసి భవాగ్నితాపభయ మాఁగం గూర్మి రక్షింపు దే
వ! దయాసాగర! భక్తరక్షణపరత్వంబున్ బ్రదర్శింపుమా॥ 109

శ్లో. మందోఽయం మమ పాదమూలమరణం ప్రాప్తో ఽతినిర్విణ్ణధీ
రిత్యవ్యాజకృపారసేన భగవం స్త్రాయస్వ మాఽగ స్స్మర
త్వన్మాయాపరిమోహితా స్తనుభృత స్సోఽహం తదంతర్గతో
భక్తత్రాణపరాయణత్వ మధునా మయ్యాశు సత్యం కురు॥

మ. "ఇతఁ డీతండు మదంఘ్రిసన్నిధి మృతిన్ సాధించె" నంచున్ గదున్
బడి నిర్వేదుఁ డనాయమానకరుణన్ రక్షింపు మాగంబులన్
దడవన్ బోక రమేశ! దేహులు భవన్మాయావిధేయుల్ కదా!
కడకే లెక్కట! భక్తరక్షణపరత్వంబున్ బ్రదర్శింపుమా. 110

శ్లో. యోవా స్తోత్రమిదం పఠేదహరహన్ భక్త్యాఽగ్రిణీస్సస్వయం
త్యక్త్వా ఘోరదురంత నైజకలుషం శుద్ధాఽఽత్మనా ఽవస్థితః
లబ్ధ్వా సర్వమనోరథా నిహ హరేః కారుణ్యాత శ్రీయుతః
స్సాలోక్యాదిక ముక్తి మేతి స నరో దేహాఽవసానే ధ్రువమ్॥

మ. ఎతఁడీస్తోత్రము భక్తితో నహరహం బింపార వర్ణించునో
యతఁ డాగంబుల నెల్లఁ బాసి యిట నిష్టావాప్తి చేకూరి శ్రీ
యుతుఁడై దేహముఁ బాసి శ్రీశుకరుణోద్యోగంబునన్ బొందు న
న్నతసాలోక్యముఖాత్మమోక్షమునవొందన్ నిశ్చయుం బింతయున్. 111

శ్లో. శ్రీమల్లోహితగోత్రజస్య విబుధస్తోత్రైకపాత్రాఽఽత్మనో
భూమ్నః శ్రీనరసింహనామవిదుష స్సత్సూనునా సంతతమ్
శ్రీనారాయణపాదసేవరతినా భవ్యాత్మనా శ్రీజగ
న్నాథాఖ్యేన సమర్పితం స్తుతిశతం విద్వన్ముదే కల్పతామ్॥

శా. శ్రీమల్లోహితగోత్రజుండు విబుధాశీస్తోత్రసత్పాత్రుఁ డు
ద్దామశ్రీనరసింహసూరిసుతుఁడున్ ధన్యుండు వర్ణింతమున్
శ్రీమన్మాధవపాదసేవరతుఁడున్ శ్రీమజ్జగన్నాథనా
మమాత్యుండిడె దీనిఁ బండితుల కాహ్లాదంబు చేకూరఁగన్. 112

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

మ. కడుధన్యాత్ముఁడు పండితుండును రమాకాంతాంఘ్రిసేరేజ భ
క్తుఁడు పూజ్యుండును మత్పితామహుఁడు విజ్ఞుం డిద్ధిపూర్వంబుగా
నుడివెన్ వేంకట పుత్రకుండ నది తెస్గుం జేసితిన్ నేఁడు నన్
గడఁకన్ బ్రోవఁగదయ్య నేనును జగన్నాథాఖ్యుఁడన్ శ్రీహరీ॥

శ్రీ శ్రీ శ్రీ

